Registered No. M-4484

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ నవంబరు నెల 6 వ తేది శుక్రవారం [నె 44 రు.

## ఈజిప్టులో గెలుస్తున్న వీర నాయకులు.

8 వ సేనా నాయకులగు జనరలు మాంటి గొమరిగారు (కుడి), మధ్య ప్రాచ్యమునందలి మిత్రమండలి సేనల సర్వాధికారియగు జనరలు సర్ హెచ్. ఆర్. ఎల్. జి. అలగ్జాండరుగార్లు,

ఇపుడు ఈజిప్టు యుద్ధరంగమున రోమెలు సేనలు తరుమగొట్టబడినట్లు, జర్మను ఆఫ్రికా దళాధికారితో సహా 9,000 మంది శత్రు సైనికులు ఖైదీలుగా పట్టుబడినట్లు నిన్న వార్తవచ్చెను. ఈ విజయానికి పై సేనానుల యుద్ధ వ్యూహమే కారణం.

# రష్యా నౌకాదళంలో క్రొత్త నౌకలు.

రష్యా నౌకా నిర్మాణము గత మూడు నెలలలో నూటికి 20 వంతు హెచ్చినది. యుద్ధం పూర్వంకన్న యిపుడు నౌకల మరమ్మతులు చాల వేగంగా జరుగుచున్నవి. రష్యా విప్లవంయొక్క 25 వ వార్షికోత్సవం నవంబరులో జరుగునపుడు రష్యా నౌకా దళమునకు చాల క్రొత్త నౌకలు చేర్చబడును.

ఒక పెద్ద నౌకకు యిటీవల మరమ్మత్తు జరుగవలసియుండెను. అది ఆ చేరువనున్న మరమ్మత్తు స్థలమగు 'ఫ్లోటింగు డాకు' కన్న చాల పెద్ద నౌక. అందుచే సగం స్టీమరు నీటిలో నుంచి, మిగతా సగం మాత్రమే డాకువద్దకు తెచ్చి మరమ్మతుచేసి పంపిరి. ఒక పెద్ద నౌకా నిర్మాణ శాలాధికారియగు ట్రుష్కినుగారు తన నిర్మాణశాలలో యుద్ధం పూర్వంకన్న యిపుడు ఎనిమిదిరెట్లు అధికంగా నౌకలు తయారగుచున్నవని చెప్పిరి. సుర్గుచేవుగారు తన నిర్మాణ శాలలో పూర్వంకన్న నూటికి 50 వంతు ఎక్కువ తయారగుచున్నవని చెప్పిరి ఈ నౌకా నిర్మాణశాల యిటీవలనే తీరంనుండి లోభాగానికి మార్చబడెను. రష్యా నదులఒడ్డునున్న నౌకా నిర్మాణశాలలందు యిపుడు నౌకా దళానికి నౌకలు కట్టబడుచున్నవి. ఒక నౌకా నిర్మాణశాలయందు ఉత్పత్తి నిరిటికన్న ఆరురెట్లధికమైంది. ఇంకొకటి ఉత్పత్తి రెండింతలు ఎక్కువచేసెను.

లెనిన్‌గ్రాడు నగరమునందు విమానదాడులు జరుగుచున్నా సైన్యాల ముట్టడి కొనసాగుచున్నా అచట నౌకా నిర్మాణశాలలో నౌకల ఉత్పత్తి మరమ్మతు అతి చురుకుగ జరుగుచునేయున్నది. ఇటీవల ఒక రేవులో రాత్రింపవళ్లు పని జరిగి యుద్ధానికీ పూర్వంకన్న రెండు నెలలు ముందుగ మరమ్మతు పని ముగిసెను.

150 క్రొత్త ఆహార కర్మాగారాలు.

రష్యాలో ముఖ్యంగా తూర్పు ప్రాంతాలందు ఆహార పదార్థముల పరిశ్రమలయందు రెండుమూడు క్రొత్త కర్మాగారములు స్థాపింపబడుచున్నవి. ఈ యేడు ప్రభుత్వం వారు 150 క్రొత్త ఆహారపదార్థముల కర్మాగారములు స్థాపింపదలచిరి. అందు 50 అపుడే పనిచేయుచున్నవి. చక్కెర మిల్లులు, నూనె మిల్లులు, రొట్టెల కర్మాగారాలు, పొగాకు ఫాక్టరీలు మున్నగునవి. క్రొత్తవి స్థాపించుటయే గాక మాస్కో, తుల, కలమీను, స్మోలెన్స్కు రయజాను జిల్లాలలో ప్రాతవి 108 ఫ్యాక్టరీలు పునరుద్ధరింపబడినవి. మధ్య ఏషియా రాష్ట్రమగు కజకస్తానునందు ఒక మాంసాగారమునందు శిబ్బందిని ఎక్కువచేయకుండా ఉత్పత్తి 2 రెట్లధికంచేసిరి.

—సోవియటు వారు న్యూసు.

# బ్రిటిషు స్త్రీల యుద్ధకృషి పోటీ.

లండను స్త్రీల పార్లమెంటు సంస్థ ఏర్పాటు చేసిన "యుద్ధంలో గెలవండి" అను పోటీయందు బ్రిటిషు స్త్రీలందరు పాల్గొనుటకు పందెములు వేసుకొనుచున్నారు. ఈ పోటీలో కర్మాగారములలోనున్న స్త్రీలు, కచేరీలలో దుకాణములలో నున్నవారు, ఎవరి పనులలో వారు యుద్ధంకొరకు ఎక్కువ ఉత్పత్తిచేయాలని పోటీ చేసుకొందురు. పనిలోనుండి నిలచిపోకుండా ఖర్చు తగ్గించి రద్దులేకుండా ఉత్పత్తి ఎక్కువ చేయుదురు. వేరువేరుపనులలో ప్రత్యేక పోటీ లుండును. ఉత్పత్తి ఎక్కువచేయుటయందు 350 ఫ్యాక్టరీలు పోటీచేయుననియు, పరిశ్రమలకు పనిచేయు స్త్రీలను చేర్చుట, రద్దులేకుండా చూచుటయందు 200 గృహిణులు పోటీచేయుదురనియు, స్త్రీల పార్లమెంటు ఆశించుచున్నది. లండనులో 3,000 పనివారుగల ఒక ఫ్యాక్టరీ ముందుగ పోటీచేసెను. ఇందు యంత్రశాఖలోను, అసెంబ్లీ శాఖలోను, యితరశాఖలలోని స్త్రీలందరు ఒకరినిమించి ఒకరు పనిచేయ పోటీ చేయుచున్నారు. ఈ పోటీయందు ప్రతీ నెల ప్రతి శాఖలో మూడు బహుమతు లొసంగబడును. స్త్రీల పార్లమెంటు సమావేశమునందు పోటీయందు గెలిచినవారు తమ విజయానికి కారణాలు ఎరింగిస్తూ ఉపన్యసింతురు.

# యుద్ధ విమర్శ.

## హాజీ యాత్ర నిలిపివేయుటకు కారణాలు—శత్రు ప్రచార ఖండనం ఈజిప్టు యుద్ధం తీవ్రరూపం దాల్చును.

**సముద్ర యాత్రకు ఆటంకం**

కొంతకాలం క్రిందట 300 మంది హాజీ యాత్రికులు కరాచీ చేరి తాము మెక్కాకు పోవుటకు నౌకల నేర్పాటుచేయమని ప్రభుత్వంవారిని కోరిరి. ప్రభుత్వంవారు వీలుండదని పోర్టు హాజీ కమిటీవారికి అక్టోబరు 28 వ తేదిన తంతివార్త పంపియుండిరి. ఈ యేడు హాజీ యాత్రకు సముద్రమార్గం ఉండదని, ఇరాకు మార్గానగూడ పంపుటకు వీలుండదనియు ముందుగనే స్పష్టంగా అందరికి తెలియునట్లు ప్రకటించినాకూడ యీ యాత్రికులు కరాచీ చేరిరి. వారికి సదుపాయాలు చేయుటకు ప్రభుత్వంవారికి ఎంత యిష్టమున్నా ప్రయాణ సదుపాయాలు చేయుటకు వీలులేక పోయిందని విచారించుచున్నారు. గత నెలలోనే ఒక ప్రకటన చేసియుండిరి. శత్రు భయం సముద్రాలలో జాస్తిగానుందని కారణం తెలిపియుండిరి. యాత్రికుల సంఘాలన్నింటిని సంప్రదించియే యీ నిర్ణయముచేసిరి.

*　*　*

**యాత్రికుల యెడ జపాను ద్వేషం.**

1940-41 వ సం॥నందు హాజీ యాత్ర సురక్షితంగా జరిగింది. అప్పటి పరిస్థితులు వేరు. గత రెండేండ్లలో ఇంగ్లాండు జర్మనీ ఇటలీలతో పోరాడుచుండెను. నౌకలకు ఇటలీ వల్ల ముప్పే యెక్కువుండెను. కాని ఇటలీ సామ్రాజ్యంలో మహమ్మదీయులు చాలమంది యున్నందునను, ముసోలిని "ఇస్లాము రక్షకుడు" అను బిరుదు కలిగియున్నందునను యాత్రికుల స్టీమరులను ముంచి ముస్లిముల ద్వేషంకొని తెచ్చుకోడం యిష్టపడకుండెను. ఇపుడు జపాను శత్రు వర్గంలో చేరింది. జపాను జలాంతర్గాములు అరేబియను సముద్రంలోను హిందూ మహాసముద్రంలోను తిరుగుచున్నవి. జపాను రాజ్యంలో చాల తక్కువమంది ముస్లిములున్నారు. ఆక్రమిత రాజ్యాలలోనున్నవారి గురించి జపాను లక్ష్యంచేయదు. కనుక యీ యేడు జపాను జలాంతర్గాములవలన హాజీ యాత్రికుల పడవలకు ప్రమాదముండునని నౌకా యాత్ర యేర్పాటు చేయలేదు.

**అక్ష రాజ్యాల తప్పుడు ప్రచారం**

ఈ విషయాన్ననుసరించి శత్రు రాజ్యాల రేడియోలు తప్పుడు ప్రచారంచేసి బ్రిటిషువారి యెడల ముస్లిములకు ద్వేషం కలిగించాలని ప్రయత్నించుచున్నవి. "నిరుడు కూడ యీ శత్రువుల భయంచేతనే నౌకలకు రక్షణ యివ్వలేక మహమ్మదీయులు యాత్ర చేసుకోకుండా బ్రిటిషువారు ఆటంకపరచిరి" అని ఇటలీ రేడియో అరబికు భాషలో అక్టోబరు 4 వ తేదిన చెప్పియుండెను. కాని అంతకు ముందు రోజునే యింతటి అబద్ధమగు కారణమే వేరొకటి చెప్పియుండెను. నౌకలు చాలక యాత్ర నిలుపబడెనని చెప్పెను. కాని నిజం ఏమంటే 1941 వ సం॥లో తొమ్మిది నౌకలు వెళ్లేయి. 1940 వ సం॥ ఐదుమాత్రమే ప్రయాణం చేసేయి. నిరుడు ఇండియానుండి 10,713 మంది మహమ్మదీయులు పుణ్యక్షేత్రానికిపోయి ప్రమాణాలు గైకొనియుండగా, యాత్ర నిషేధింపబడిందని యిపుడు చెప్పుట, ఇటలీ దురుద్దేశమునే తెలియజేస్తుంది.

*　*　*

**రోమెలు సేనలు వలయంలో చిక్కుకొనుట**

ఈజిప్టులో ఎల్ అలామిను యుద్ధం ఫలితం తేలే స్థితికి వచ్చింది. మిత్రమండలి సేనలు అక్షరాజ్య సేనల రక్షణ శ్రేణిని ఛేదించి రోమెలు సేనలకు ఎడమ ప్రక్కన స్థావరమేర్పరచుకొన్నవి. అందుచే రోమెలుగారి సేన చాలభాగం వలలో చిక్కుకొన్నట్లుందికాని యీవలవాటిని బయటకు రాకుండ నిరోధించగల శక్తి యున్నదేనాయని చూడవలసియుంది. ఆ సేనను తప్పించుటకే రోమెలు యిపుడు టాంకుదాడి ప్రారంభించెను. కాని వారి టాంకులు కొన్ని "వల"లో చిక్కుకొని

రాలేకుండా యున్నాయి. బ్రిటిషు సేనానియగు జనరలు మాంటి గోమరీగారు (బ్రిటిషు సేనాని) యింకా తీవ్రమగు యుద్ధం చేయవలసియుండును.

ఎదిటి సైన్యాన్ని ముఖాముఖి ఎదిరించి నాశనం చేయుట యుద్ధంలో చాల కష్టమైన పని. కాని జనరలు మాంటి గోమరీగారు అదే ప్రయత్నించుచున్నారు. ఈ యుద్ధం కడు దీర్ఘముగను కష్టముగను జరుగగలదు. కాని యిందు నాల్గు ప్రోత్సాహకరమగు చిహ్నాలు గలవు. ఒకటి విమానశక్తి అధికమగుట. మధ్యధరా సముద్రంలో మిత్రమండలి విమాన చర్యలు గాంచినచో యిది స్పష్టమగును. సెప్టెంబరులో రోమెలు వెనుకపడినప్పటినుండియు అతనికి సరకు తెచ్చు నౌకలను, రేవులను నిలువయున్న పెట్రోలు మందుగుండు రవానాబండ్లు అన్నింటిని మిత్రమండలి విమానాలు బాంబులు వేసి ధ్వంసంచేయుచున్నవి.

* * *

ఉత్తరాఫ్రికాలో యుద్ధాన్ననుసరించియే జినోవా, టురిను, మిలాను, ఇటలీ నగరములపై బ్రిటిషు విమానాలు బాంబులు వేసినవి. జినోవానుండియే సిసిలీ లిబియాలందలి అక్షరాజ్యాల సేనలకు సప్లయిలు పోవును. టురిని ముఖ్యమగు పరిశ్రామిక నగరం. మిలానుమీదుగనే నేలమార్గాన వచ్చిన జర్మనుసేనలు జినోవా దక్షిణ ఇటలీ రేవులకు పోయి స్టీమరెక్కును. క్రీటు దీవిలోనున్న మెలామి విమానాశ్రయంనుండి సేనలు విమానాలతో రోమెలుకి సహాయంగా వస్తున్నవి.

రెండవ శుభసూచన ఏమంటే బ్రిటిషు కాల్బలము యిపుడు కాలూని నిలువగల్గుచున్నది. రోమెలు ఎటువంటి తీవ్రదాడిచేసినా వారికిపుడు భయంలేదు.

మూడోది, శత్రురక్షణ శ్రేణులు రెండింటి మధ్య ఎడం ఎక్కువగుచున్నది. మిత్రమండలి సేనలు మందుగనుల నాటి శత్రు శిబిరాలు కొన్నింటిని ఫిరంగులతోను విమానదాడులతోను నాశనంచేసి తమకాల్బలం త్రోసుకొని పోవుటకు తోడ్పడినవి.

టాంకులను ఉపయోగించే పద్ధతిలో యిపుడో మార్పు వచ్చింది. ముందుగ టాంకులు దాడి పోయినచో నేలను కనబడకుండా నాటబడిన మందుగనులచేతను శత్రు ఫిరంగులచేతను నాశనం చేయబడగలవని తెలుసుకొనిరి. కావున ముందుగ కాల్బల సైనికులును ఫిరంగి దళములును దారి సదునుచేసి టాంకులు వెనుక వచ్చినచో అప్పటికే శత్రువులముందు వరుస సైనిక దళం కొంత యుద్ధంచేసి నీరసించి యుండును కనుక, టాంకులు త్రోసుకొనివచ్చి తీవ్రమైన దాడిచేసి విజయం పొందవచ్చును.

నాల్గో శుభసూచన ఏమంటే శత్రువు క్వెట్టారాడిప్రెషనునుండి తప్పించబడెను కనుక 700 అడుగుల ఎత్తున ఉండి యుద్ధంచేసే సదుపాయం వారికి పోయింది.

* * *

ఈ అనుకూల పరిస్థితులకు ప్రతిగా కొన్ని ప్రకృతి సిద్ధమగు ప్రతిబంధకాలుగలవు. క్రొత్తగ వచ్చిన శత్రువుల ఆఫ్రికాసేన పట్టుదలతో చివర వరకు పోరాడే రకం. రోమెలు రక్షణ శ్రేణులు చాల బలవత్తరంగానున్నవి. కనుక వాటిని తగ్గించుట చాల కష్టసాధ్యమగు పని. యుద్ధ రంగంనుండి ఫలితం సూచనలు యిపుడపుడే రావని కైరో ప్రత్యేక విలేఖరి వ్రాసెను. శత్రు రక్షణ శ్రేణులు చాల లోతుగ దిట్టముగ కట్టబడిన టాంకు ప్రతికూల కట్టడములు, విరివిగ నాటబడిన మందుగనులు, ముండ్లతీగలు, మర ఫిరంగి గూళ్లు, ఫిరంగి కేంద్రాలు మున్నగు వానితో కూడియున్నవి.

జనరలు మాంటి గోమరీగారు తన మామూలు ఎడారియుద్ధంచేసే పద్ధతిని మాని క్రొత్త పద్ధతులను అనుసరించుచున్నారు. వారు ముందుగ విపరీతముగా ఫిరంగి గుండ్ల వర్షం కురిపించి తరువాత, పైన విమానాల సహాయంతో ఏర్చి కూర్చిన కాల్బల సైనికులను దాడి పంపును. విమానాలు శత్రు సప్లయి మార్గాలనుకాచి కొడుతూ వుంటాయి. ప్రస్తుతం జరుగుచున్న యీ ఎల్ ఎలామీను యుద్ధంలో యిరుపక్షాలవారు చాల పట్టుదలతో యుద్ధం చేస్తారనడానికి ఎట్టి సందేహంలేదు.





✻

ఇంగ్లాండును కాపలా కాస్తూ వున్న రికనాయసెన్సు స్క్వాడ్రనుకు చెందిన ఒక సైనికుడు బ్రెనుగను ఉపయోగించుట.

✻

# భారత సైనికుల కుటుంబాలు.

## యోగక్షేమంచూసే ఉద్యోగులు.

రెండున్నర లక్షల భారతీయ కుటుంబాలకు "తండ్రి" వలె పనిచేయు సివిలు లైసాను ఆఫీసరులను ప్రభుత్వంవారు ప్రతిరాష్ట్రంలోను నియమించిరి. భారతీయ సైనికులు తమ సందేహాలు యిబ్బంధులు సమస్యలగూర్చి యీ ఉద్యోగులకు తెలుపుకుంటూ వుంటారు.

విదేశాలందు పనిచేయుచున్న సైనికులు తమ ఆత్మీయులగు భార్యా బిడ్డలు ఇండ్లలో ఎట్లున్నారో అని ఆదుర్ధపడుట సహజమని తెలిసి భారతీయ సైనికాధికారులు 'మిలిటరీ యోగక్షేమకార్యాలయములను' ప్రతి రాష్ట్రంలో నియమించిరి. ఈ కార్యాలయోద్యోగులు సైనికుల కుటుంబాల యోగక్షేమం అరయుటకేగాక భారతీయ నావికులు వైమానికుల కుటుంబాల యోగక్షేమానికిగూడ బాధ్యులే.

చన్న రాష్ట్రంలో స్థాపింపబడిన యిట్టి మిలిటరీ వెల్ఫేరు ఆఫీసునందు, ఒక సివిలు లైసాను ఆఫీసరు, ఒక డిప్యూటి మిలిటరీ వైసు ప్రెసిడెంటు, 12 గురు జిల్లా మిలిటరీ వెల్ఫేరు ఆఫీసరులు వివిధ జిల్లాలలోను గలరు.

**వారు చేసేపనులు.**

ఈ ఉద్యోగులు తమకు ఒప్పగించబడిన కుటుంబాలకు అనేక విధములగు సహాయములు చేస్తూవుంటారు. బిడ్డలకు విద్యా సౌకర్యము లొనగూర్చుట, జబ్బువారికి ఆసుపత్రి చికిత్స, భూమికొరకు దరఖాస్తులు, సినీమాలకు ఉచితంగా టిక్కెట్లు యిప్పించుట మొదలగునవి వారుచేసే సామాన్యమైన పనులు.

సైనికులవద్దనుండి ఉత్తరాలుకాని డబ్బుగాని రాలేదని ఫిర్యాదువచ్చినా వారి కుటుంబాలకు అలవెన్సులు ఫించనులు అందుట ఆలశ్యమైనా, సైనికులు ఎచ్చటనున్నారో తెలియకపోయిన, యుద్ధ ఖైదీలుగానున్నా అవన్ని విచారించి వెల్ఫేరు ఆఫీసు దర్యాప్తు చేసి తోడ్పడుచుండును. యుద్ధం చేస్తున్న సైనికుల న్యాయమగు హక్కులన్ని ఆ ఆఫీసువారు కాపాడుతూవుంటారు.

యుద్ధంలో పోరాడిన సైనికుడు ఆ పని ముగియగానే అశ్రద్ధచేయబడడు. విడుదలైన సైనికులకు పనులు సంపాదించుటకు, అవసరమగు వారికి వైద్య చికిత్స యేర్పాటుచేయుటకు, ఇండియను ఆర్మీ సహాయ నిధినుండి పేదవారికి ధన సహాయం చేయుటకును ప్రత్యేక శాఖ యొకటి గలదు.

సివిలు లైసాను ఆఫీసరు 270,000 మంది గల యీ పెద్ద "కుటుంబాన్ని" కాపాడుతూ వుండాలి, వారున్న తావులకు పోతూవుండాలి, వారి సహాయకార్యాలన్ని ఏర్పాటుచేయాలి. సైనికుల కుటుంబాలుచేసే ఫిర్యాదులకు వారి కష్టాలను ఓర్పుతో విని సహాయం చేస్తూవుండును.

# ఇంగ్లాండులో యుద్ధ పరికరాల నిర్మాణము.

మూడేండ్ల యుద్ధకాలంలో యుద్ధనౌకల మరమ్మత్తులు 23,000 మించియు, వర్తకనౌకలు 35,000 తిరిగి ఉపయోగపడునట్లు చేయుటయు ఇంగ్లాండులో జరిగెనని వైసు-అడ్మిరలు వాకరు గారు ప్రకటించిరి. 1939 జూనునుండి యిప్పటికి 100 టన్నుల మించిన వర్తకనౌకలు 7,009 బ్రిటీషు రిజిస్ట్రీరునందు గలవు. ఇవి యుద్ధం మొదలయినప్పటినుండి యిప్పటికి కనీసం ఐదు సారులేన మరమ్మతులకు వచ్చియుండునని పై లెక్కలబట్టి తెలియగలదు. నౌకల మరమ్మతు శాలలందు పనివారు చాల ఎక్కువగ అద్భుతంగా పనిచేయుచున్నారు. కొన్ని చిన్న మరమ్మతులు నౌకలోని సామాను దించుచుండగానే జరిగిపోతాయి కాని కొన్ని పెద్ద మరమ్మత్తులకు కనీసం 8 నెలలు పనియుండును.

ఒకేసారి 20 లక్షల టన్నుల బరువైన నౌకలకు రేవులందు మరమ్మతులు జరుగుచున్నవన్నమాట. గత యుద్ధంలో నాల్గోయేడాదికన్న యీయేడు పనివారు 100,000 తక్కువమంది యున్నప్పటికి యింత యెక్కువ పనిజరిగినది. 1942 మేతో అంతమయ్యే ఏడాదిలో బ్రిటీషు నౌకా నిర్మాణ శాలలందు 1917 వ సంవత్సరంకన్న యెక్కువ నౌకలు నిర్మించబడినవి ; 1918 లో నిర్మింపబడినన్ని యించుమించుగా నిర్మింపబడినవి.

ఇదివరకుకన్న ఎక్కువ మరమ్మతు పనులు జరుగుచునేయున్నవి. అంతేకాక నిరుడు యుద్ధంలో ఎరగనటువంటి క్రొత్త రకాలు టాంకులను రవానాచేసేవి మున్నగునవి కట్టబడినవి. నౌకా నిర్మాణశాలలందలి కార్మికులకు మరింత ఎక్కువ పని కల్పించబడెను.

ఇంజనీరింగు శాఖయందు ప్రతిదినము 7,500,000 పౌనుల విలువగల పనులు, అనగా నిముషానికి 5,000 పౌనుల విలువగల పనులు చేయించుచున్నామనియు, లక్షలకొలది పనివారిచే 30,000 కంపెనీలయందు యీ పనులు జరిపించబడుచున్నవనియు ఉత్పత్తిశాఖ మంత్రి ప్రకటించెను.

"ఇంగ్లాండులో ఒకే పరిశ్రమచేయుచున్న కంపెనీలు పోటీలేకుండ కలిసికట్టుగ పనిచేయుచున్నవి. ఒక పెద్ద కంపెనీ యాజమాన్యం వహించి తక్కిన అన్నింటి శక్తిని కూడదీసి పనిచేయించును. అది మెచ్చదగియున్నదని అమెరికా ఓహియోలోని క్లైవెలెండునందు సర్ లాయి బీలేగారు నుడివిరి. ఒక పెద్ద గరాజ్ కంపెనీ యుద్ధసహాయకార్యము చేయుచున్నది. చేరువ ప్రాంతాలలోనున్న చిన్న గరాజ్ కంపెనీలు 100 తిరిగి చురుకుగా పనిచేయునట్లు చేసిరి. వాటిలో 50 కంపెనీలందు 10 మందికన్న తక్కువ పనివారు, 36 లో పదినుండి 25 వరకును పనివారు, 17 కంపెనీలలోమాత్రం 25 మందికన్న ఎక్కువ పనివారు పనిచేయుదురు. ఫిరంగి వాహనములు, మందుగుండ్లు తయారు చేయుటయందు యీ కంపెనీలన్ని నేర్పుచూపినవి. ఫిరంగి గుండ్లు, బాంబు భాగాలు, చిన్న ఆయుధాలు, ఫిరంగి వాహనముల భాగాలు యీ కంపెనీలందు తయారుచేయబడినవి. ఈ కంపెనీవారు యిపుడు తమకు ఆర్డరువచ్చిన పనంతా చేయలేకుండా యున్నారు. అదివరకు ఏమిపని జరగనిచోట యిపుడు నెలకు 50,000 డాలరుల విలువగల పని జరుగుచున్నది. ఆ పని ఎక్కువ నేర్పరులుకాని సామాన్యపు పనివారు సాధారణపు పనిముట్లతో చేసినపని. ఈ కంపెనీలలో నియమింపబడిన 2,000 మందిలో 1,300 మంది స్త్రీలు, 700 పురుషులు, 1,800 మంది నేర్పరులుకాని పనివారు, 200 మంది నేర్పరులు. కొన్ని చిన్న కంపెనీలు పనివారిని మూడు జట్లుగ మార్చి పనిచేయించుచున్నవి. అన్నింటికి డబ్బు సరఫరాచేయుట, లెక్కలువేయుట తణిఖీచేయుట పెద్ద గరాజ్ కంపెనీ పూచీయే" అని సర్ లూయీగారు తెలిపిరి.





భారత సర్వ సేనాధికారి జనరలు వావెలు యిటీవల శత్రు వశమయియున్న బర్మాదేశం పోయినపుడు అచటి దేశీయ నాయకులు స్వాగత మొసంగుట.

# సైన్యంలో పోస్టు ఉద్యోగాలు.

ఇండియను సైన్యం పోస్టలు దళములందు హవల్దారులుగ సివిలు ప్రజలను చేర్చుకొనుట యిపుడు జరుగుచున్నది. ఈ ఉద్యోగాలు యుద్ధ కాలంలో ఉండుటేగాక, విజయం పొందినాక ఇండియను పోస్టు టెలిగ్రాఫ్ శాఖయందు స్థిర మయిన ఉద్యోగాలు దొరికే అవకాశం ఉం డును.

18 సం॥ నుండి 25 సం॥ల వరకు (కొందర విషయంలో 30 కూడా) వయసుగలవారు ఇండి యను జనరలు సర్వీసు కోరులో చేర్చుకొనబడు దురు. మూడు లేక నాల్గు నెలలు శిక్షణ యొసంగ బడుదురు. ఆ కాలంలో సిపాయి బేసికు జీతం పైన నెలకు రూ. 29 భత్యము ఒసంగబడును. పోస్టుమాస్టరు ట్రెయినింగు అయేవారికి మూడో నెల తరువాత నెల భత్యం రూ. 44 వరకు పెంచబడును.

శిక్షణ పూర్తికాగానే వారు సైనిక పోస్టలు దళములందు ఖాళీలలో నియమింపబడుదురు. హవల్దారు హోదాలోనుండి దానికి తగిన జీతం, అదనంగా గ్రేడు జీతం పుచ్చుకుంటారు. పోస్టు మాస్టరులకు 1 వ గ్రేడు రేటు, గుమాస్తాలకు 2 లేక 3 గ్రేడు జీతాలు యివ్వబడును.

కనీసం మెట్రిక్యులేషను లేదా దానికి తగిన పరీక్ష ప్యాసయి ఉండాలి. కొన్ని ప్రత్యేక సంద ర్భాలలో అదీ అక్కరలేదు.

సైన్యంలో సంతృప్తికరంగా ఒకఏడాది పని చేసినవారు, విడుదలయిన పిదప పోస్టు టెలి గ్రాఫ్ శాఖలలో స్థిరమయిన ఉద్యోగాలకు అర్హు లగుదురు. ఈ శాఖలో ఖాళీలలో నూటికి 50 వంతు యిటువంటి సైనికశాఖ ఉద్యోగులచే నింపు టకు ప్రత్యేకించబడినవి. యుద్ధం ముందుగ ముగిసినందువల్ల సైన్యంలో ఏడాది సర్వీసు చాలనివారికిగూడ యీ అర్హతయుండును.

సైన్యంలో ఉచితంగా భోజన పదార్థాలు, బట్టలు బస దొరకుటేగాక నెలకు రూ. 300 గూడ సమర్థులగువారు గడించుకొనుటకు అవ కాశముండును. వివరాలు టెక్నికలు రిక్రూటింగు ఆఫీసరులవద్ద బడయవచ్చును.

# స్త్రీలపైని, ఖైదీలపైని జపానువారి అత్యాచారాలు.

## 9,000 యువతులను వ్యభిచారంలో దింపుట.

### వీధులలో ఉరి శిక్షలు.

జపాను సైన్యం కొరకున్న వ్యభిచార మందిరాలకు 9,000 మంది యువతులు బలవంతంగా పంపబడిరి-యుద్ధంలో పట్టుబడిన భారతీయ ఖైదీలను గోచీలతో నిలబెట్టిరి-నడి వీధులలో పది రోజులు ఉరి శిక్షలు జరిగినవి.

జపాను ఆక్రమించిన దేశాలలో పై విధంగా జరుగుచున్నది. ఆ దేశాలలో స్వయంగా చూచివచ్చినవారు, జపానువారిచే హింసింపబడిన వారే యీ వివరాలు తెలిపిరి.

ఉదయించుచున్న సూర్యభగవానుడు జపాను పతాకంలోని గుర్తు. ఈ ఉదయభానుడు మలయ బర్మాలందు ఎటువంటి పాపఘోర కృత్యాలకు చిహ్నమయినాడో తెలుపు కరపత్రమొకటి లభించింది. అది ఎట్లు లభించిందో ప్రస్తుతం తెలుపవీలులేదు.

సివిలు ప్రజలను ఔదార్యంతో చూతుమనే వాగ్దానాలు జపానువారు నిలపెట్టుకోలేదని యీ పత్రము రుజువుచేయుచున్నది. సింగపూరును గురించి అందు యిట్లు గలదు—

### స్వంత సమాధులు త్రవ్వించుట.

"ఆ ద్వీపం జపానువశమయినాక అందున్న చీనావారందరిని నిర్బంధించి, వారిగోతులు వారి చేతనే బలవంతంగా త్రవ్వింపించిరి. తరువాత ఆ గోతులలో వారిని మోకాళ్లపై కూర్చోమనిరి. ఒక జపాను పెద్ద ఉద్యోగి కూర్చున్న వరుసలో ముందున్న వానిని కత్తితో నరికెను. తరువాత యింకొక దిగువ ఉద్యోగి యితరులందరి తలలు నరికివేశెను. ఇంకో వరుస ఖైదీలు ముందు వరుసవారి శవాలను గోతులలో పూడ్చిపెట్టునట్లును, తరువాత తమగోతులు త్రవ్వుకొనునట్లును నిర్బంధింపబడిరి."

### ఆడపిల్లల నెత్తుకపోవుట.

ఈ హత్యలు భూస్థాపనలు సింగపూరు వీధులలో వరుసగ 10 రోజులు నిరంతరాయంగ జరిగినవి. అంతకముందీ వీధులలో శాంతిప్రియులగు ప్రజలు నిరభ్యంతరంగా స్వేచ్ఛగ తిరుగుచుండిరి.

స్త్రీలకు జరిగిన మర్యాదగురించి ఆ పత్రమునందు యిట్లు తెలుపబడెను :—చీనావారందరిని జపానువారు రిజిస్టరుచేసిరి. 13 నుండి 25 సంవత్సరముల వయసుగల యువతులందరిని యిండ్లనుంచి తీసుకపోయిరి. తలిదండ్రులు ఎంత మొర పెట్టుకున్నను లాభంలేకుండెను. తరువాత 9,000 యువతులు జపాను సైన్యం కొరకేర్పడిన వ్యభిచార గృహములందున్నట్లు తెలిసెను.

ఇక ఖైదీలగురించి: అనేక మంది భారతీయుల దుస్తులను ఊడబెరికి చెడ్డీలతో మాత్రం నిలబెట్టిరి. జపానువారు వారిని బానిసలుగ జూతురు. ఒక వైశ్రాయి కమిషండు ఆఫీసరు మంచినీళ్లడిగిన 'నేరానికి' తుపాకితో కాల్చి చంపబడెను.

---

# విష బాణాలు.

వదంతులున్నాయి జాగ్రత్త!  
అవి  
మీ మనస్సును మభ్యపరచి  
మీ బుద్ధి చెడగొట్టి  
మీచే తెలివితక్కువ పనులు చేయించుటకు  
శత్రువు పంపే విష బాణాలు.

* వదంతులు నమ్మకండి *



జపానువారిని ఎదుర్కొనుటకై దేశీయ యుద్ధరంగం తయారుచేయుడు.

# బాకు పట్టలేని బాకు.

దొంగవాడంటే ఇంటివాని కెంత భయమో ఇంటివాడంటే దొంగవాడికికూడా అంత భయం గానే ఉంటుంది. బహుశః ఇంకా ఎక్కువ గుండె దిగులుగానే ఉంటుంది. అదే విధంగా మనము శత్రువును జయించుటకు ఎంత ఆందోళన పడుతూఉంటామో మన శత్రువుకూడా అంత ఆందోళన పడుతూనే ఉంటాడు. దండెత్తి వచ్చిన శత్రువుకు ఏ మాత్రము చిక్కులు కలిగినప్పటికీ, అనుకొన్న ప్రకారం యుద్ధ తంత్రం సాగనందుకు శత్రువుకు ప్రాణం తల్లడిల్లుతూ ఉంటుంది. ఎందుచేతనంటే, సాధారణమైన అక్రమ దొంగతనంకంటె, అక్రమ దండయాత్ర ఎక్కువ చిక్కులతోకూడిన విషయమై ఉంటుంది. దొంగవాడు తనకుతాను స్వతంత్రంగా పూనుకొని చేసేది దొంగతనం. యుద్ధం అటువంటిది కాదు. అక్రమ యుద్ధయాత్ర సాగించేది ఎవడో ఒకనాయకుడే అయినప్పటికీ, అతని ఆజ్ఞ ప్రకారం యుద్ధంచేసేది సైన్యం. ఈ సైన్యంలో కొన్ని లక్షలు, కొన్ని కోట్లు సైనికులు ఉంటారు. ఈ సైనికులందరూ ఆ యుద్ధ నాయకునకు ఎక్కడినుంచి ఎట్లా లభించారనే విషయం మనం ఆలోచించాలి. దేశంలో ఉన్న ప్రజలలోనుంచే ఆ సైనికులందరూ వచ్చారు. యుద్ధయాత్ర సాగించేటటువంటి నాయకుడు దేశంలోఉన్న ప్రజలనే యుద్ధరంగంలోనికి దిగవలసినదని ప్రేరేపించి దింపుతున్నాడు. తనకుగల పలుకుబడిచేతను, అధికార ప్రాబల్యం చేతను, ఆ ప్రజలను యుద్ధ రంగంలోనికి తీసికొని పోతున్నాడు. అయితే, లక్షలకొలది ప్రజలు, కోట్ల కొలది ప్రజలు ఆ నాయకునిమాట శిరసావహించి యుద్ధ రంగంలోకి ఎందుకు పోతున్నారు ? ఎందుచేత తమ ప్రాణాలను యుద్ధ రంగంలో అర్పిస్తున్నారు ? అనే విషయం బాగా ఆలోచించాలి. ఏదో ఒక మహద్భాగ్యం తమ దేశానికి లాభిస్తుందనే ఆశచేత యుద్ధానికి వస్తారు. లేదా తామొక గొప్ప ధర్మ ప్రతిష్ఠాపన చేస్తున్నామనే వీరావేశంచేతనూ, భక్త్యావేశంచేతను యుద్ధ రంగంలోనికి దూకుతూ ఉంటారు.

ఇప్పుడు హిట్లరు యితర రాజ్యాలమీద కత్తి కట్టి తన జర్మనీలోని ప్రజలను యుద్ధానికి పురికొల్పి మూడు సంవత్సరములనుండియు ఘోరమైన సంగ్రామం సాగిస్తున్నాడు. తన ప్రజలకు ఏమని బోధించి వాళ్లను యీ యుద్ధంలోకి ప్రేరేపించి దింపగల్గినాడనే విషయం బాగా ఆలోచించాలి. హిట్లరుచెప్పిన విషయాలు జర్మను ప్రజలు ఆమోదించినారా ? హిట్లరు సంకల్పించిన దిగ్విజయయాత్ర సులభ సాధ్యమని జర్మను ప్రజలు గ్రహించినారా ? అనే విషయంకూడా పరిశీలించాలి. జర్మనీని యితర రాజ్యాలన్నీ అణగ ద్రొక్కివేయవలెననే ఉద్దేశంతో యితర రాజ్యాలన్నీ కుట్రచేస్తున్నవనే సిద్ధాంతమొకటి హిట్లరు తన ప్రజలకు బోధించాడు. అన్నింటికన్నా ముఖ్యంగా, జర్మనీకి సమీపంలోఉన్న రష్యా రాజ్యం తన సామ్యవాదమును విస్తరింపజేసి జర్మనీ రాజ్యమునకు పెద్ద ముప్పుతెచ్చిపెట్టుటకు సిద్ధంగాఉన్నదని హిట్లరు వాదించాడు. రష్యా రాజ్యంలోని సామ్యవాద తత్వాన్ని రూపుమాపనియెడల, లోకానికి పెద్ద సంక్షోభం తప్పకుండా వస్తుందని బోధించాడు. సామ్యవాద నిర్మూలనమే తనయొక్క బ్రహ్మాండమైన సంకల్పమనియు, లోకాన్ని ఉద్ధరించడంకోసం యీ పనికి జర్మనీ పూనుకొనవలసి యున్నదనియు బోధించి గ్రంథాలుకూడా వ్రాశాడు. లోక సంగ్రహార్థంగా, ధర్మ సంస్థాపనార్థమై, రష్యా ప్రభుత్వ పద్ధతిని తాను నిర్మూలించుటకు సంకల్పించానని లోకానికి చాటించాడు. ఈ విధంగా ప్రచారంచేసి, తనయెడల తన ప్రజలకందరికీ భక్తి తాత్పర్యములు కలుగజేసికొని జర్మనీని యుద్ధానికి సిద్ధపరిచాడు.

కాని, యుద్ధం ఏ విధంగా ప్రారంభించాడు ? పోలెండుమీదకు ముందుగా దండయాత్ర సాగించాడు. పోలెండుమీదకు దండయాత్ర సాగించుటకు పూర్వం, రష్యాయెడల అపూర్వమైన స్నేహభావం ప్రకటించాడు. రష్యాతో స్నేహంగా ఉండడమే తన అభీష్టమనిన్నీ, రష్యాను సంతృప్తిపరచడమే తన సంకల్పమనిన్నీ ప్రకటించాడు. ఎందుచేత ? అని అడగండి. రష్యాయెడల హిట్లరుకు ఎంత ద్వేషం ఉన్నదో, అంత భయం ఉంది. తన యుద్ధయాత్రకు రష్యా ఆటంకములు కలుగజేస్తే, తన యుద్ధయాత్ర

సాగదని గ్రహించాడు. రష్యానుచూస్తే హిట్లరుకు భయం కలిగింది.

ఒక సంవత్సరం గడిచింది. దొంగ బయట పడ్డాడు. రష్యామీదనే మొదటినుంచిన్నీ కన్ను వేసియుండిన్న హిట్లరు, రష్యానే విరుచుకొని తినుటకు సిద్ధమైనాడు. రష్యా అంటే భయ పడిన హిట్లరు, రష్యామీదనే కత్తికట్టి యుద్ధం సాగించాడు. రష్యాతో దొంగస్నేహం నటించిన హిట్లరు, రష్యాకు శత్రువై సమరం సాగించాడు. ఇన్ని దొంగవేషాలు ఎందుకు వేశాడు ? ఇన్ని కుతంత్రాలు ఎందుకు నటించాడు ? రష్యాను చూస్తే హిట్లరుకు భయం ఉండడంచేతనే, దొంగవానికున్నంత భయం మరెవ్వరికీ ఉండదు.

రష్యామీదకు దండెత్తి, యూక్రేను పరగణా ఆక్రమించాడు. రష్యా రాజ్యం అంతటిలోను ఇది చాలా సారవంతమైన పరగణా. పాడిపంటలతో తులతూగుతున్న ప్రాంతం యిది. అనేక లోహాలు అనేక ఖనిజములు సమృద్ధిగా కలిగి అనేక పెద్ద ఫ్యాక్టరీలుగల లక్ష్మీనివాసంవంటి పరగణా యిది. అటువంటి యూక్రేను పరగణాలోని గోధుమ పంటను అనుభవించడానికి దానిని ఆక్రమించాడు. దానికంటె ఇంకా ఎక్కువ సిరిసంపదలుగల్గి, దివ్యమైన బ్రహ్మాండమైన కిరసనాయిలు గనులు గల్గిన కాకసను పరగణా దానికి ప్రక్కనే ఉన్నది. ఈ కాకసను పరగణాలోని బాకువద్ద చాలా పెద్ద కిరసనాయిలు గనులు ఉన్నాయి. ఈ బాకు కిరసనాయిలు గనులలో సాలుకు 2 కోట్ల టన్నులు కిరసనాయిలు లభిస్తోంది. ఈ బాకు గనులను ఆక్రమించి వశపరచుకోవలెననే సంకల్పంతో కాకసను పరగణాలోనికికూడా తన జర్మను సేనలను వేట కుక్కలవలె పంపించాడు. ఇటీవల హిట్లరు తన జర్మనులకు చెప్పుతున్న మాటలను బాగా గమనించవలసియున్నది. "ఇంతవరకూ రష్యాతో చేసిన యుద్ధంవల్ల జర్మనీకి దివ్యమైన సారవంతమైన పంట భూములు లభించాయి కనుక, జర్మనులకు చాలా లాభకరమైన యుద్ధం సాగిస్తున్నాను" అని హిట్లరు చెప్పుచున్నాడు. రష్యాయొక్క సామ్యవాద తత్వాన్ని అణచివేయడమే తన సంకల్పమని హిట్లరు ఒకప్పుడు చాటించాడు. కాని, రష్యాలోని సారవంతమైన, సంపదల కాపురమైన భూభాగమును ఆక్రమించడమే తన యుద్ధ ఫలిత పర్యవసానమని బాహాటంగా ఇప్పుడు చెప్పుతున్నాడు. కాబట్టి ప్రారంభంలో దొంగ ధర్మ సిద్ధాంతాలు చాటించి, చివరకు రష్యా రాజ్యమును దోచుకొనుటకై యుద్ధం చేస్తున్నాననే సంగతి వెల్లడించాడు. దొంగ బయట పడినాడు. రష్యాతో యుద్ధం చెయ్యడంవల్ల జర్మనీకి దివ్యమైన ఆస్తి లభిస్తుందనే మాటలు ఇప్పుడు చెప్పి, జర్మను సేనలను, జర్మను ప్రజలను రష్యను యుద్ధరంగంలోకి తీసికొని వస్తున్నాడు.

రష్యాతో యుద్ధం త్వరగానే ముగియగలదని హిట్లరు అంచనా వేశాడు. రష్యాను జయించడం రవ్వంత పని అన్నాడు. నాలుగైదు మాసాలలో జయించగలమని చెప్పి, అరచేతి వైకుంఠం చూపించాడు. కాని, యీ విషయంలో హిట్లరు జర్మను ప్రజలను భ్రమపెట్టి నాడని యిప్పుడు జర్మను ప్రజలు బాగా గ్రహిస్తున్నారు. సంవత్సరం పైన గడచింది. ఇంకా యీ రష్యా యుద్ధం అగాధమైన మహాగాధగా ఉంది. ఇక జర్మను ప్రజలు ఓపిక పట్టలేకుండా ఉన్నారు. వాన్‌బాక్ అనే జర్మను సేనాధిపతిని రష్యను యుద్ధ రంగంలో పోరాడే జర్మను సేనలను నడిపించుటకోసం నియమించాడు. వాన్‌బాకు చాలా సమర్థుడనిన్నీ అతడు జగజ్జేగీయమానంగా జర్మను సేనలను కాకసను పరగణాలోనికి నడిపించి, కాకసను పరగణాలో చిట్టచివరవరకు పోయి, బాకువద్దనున్న కిరసనాయిలు గనులను ఆక్రమించగలడనిన్నీ, హిట్లరు గట్టిగా నమ్మి, ఆ జర్మను సేనాధిపతిని నియమించాడు. కాని, త్రోవలో ఉన్న స్టాలినుగ్రాడు నగరంవద్ద గడచిన ఆగస్టు మాసంనుంచీ యీ రోజువరకూ జర్మను సేనలు యుద్ధం చేస్తూనే ఉన్నాయి. స్టాలినుగ్రాడు నగరాన్ని బాకు సేనాని జయించలేకపోయినాడు. కనుక యీ బాకు సేనాని బాకు గనులవరకూ ఎట్లా పోగలడు ? ఒక్క స్టాలినుగ్రాడు నగరంవద్ద మూడు మాసాలనుంచీ యుద్ధంచేసి చేసి జర్మను సేనలు లక్షోపలక్షలుగా నాశనమవుతున్నాయి. స్టాలినుగ్రాడు యుద్ధంలో ఇంతవరకూ 5 లక్షల జర్మను సేన నష్టమైనదని బర్లిను నగరంలోని జర్మను సైనికాధికారులే లెక్క కట్టినారని నిన్న మొన్న వచ్చిన వార్తలవల్ల తెలిసింది.

ఇప్పు డిక హిట్లరుకు కర్తవ్య మేమిటి ? బాకు సేనాని బాకు పట్టలేకపోయినాడు గనుక,

యీ బాకు సేనానిని వెంటనే హిట్లరు బర్తరఫు చేసాడు. అతనితోబాటు వాన్‌హోల్డరు అనే జర్మను సేనానిని కూడా బర్తరఫు చేసాడు. అతనితోబాటు వాన్ క్లీస్టు అనే జర్మను సేనాధిపతిని కూడా బర్తరఫు చేసాడు. వాన్‌హాత్ అనే కొత్త సేనాధిపతిని నియమించాడు. ఎవరిని బర్తరఫుచేసినా, ఎవరిని నియమించినా, 5 లక్షల జర్మను సేన ఒక్క స్టాలినుగ్రాడు యుద్ధంలో నష్టమైంది. ఇంకా ఎంతకాలం యీ యుద్ధం సాగించడం ? రష్యాలో శీతకాలం ప్రవేశించింది. ఆ మంచుగడ్డలలో జర్మను సేన స్టాలినుగ్రాడువద్ద నిలువలేదు. అందుచేత వెనుకకు పోయి బందోబస్తుగా ఉన్న మకాములకు చేరవలెను. శీతకాలం వెళ్లిన తర్వాతనే అనగా 1943 వ సం॥లో తిరిగి స్టాలినుగ్రాడు యుద్ధం సాగించాలి. తిరిగి జర్మను సేన అపారంగా నాశనంకాక తప్పదు. ఏమైనాసరే, ఇంతటితో స్టాలినుగ్రాడు యుద్ధం విరమించుకుంటేనే మంచిదని జర్మను సేనానులు వాదిస్తున్నారు. కాని, హిట్లరున్నూ, అతని తాలూకు నాజీ పార్టీ నాయకులున్నూ స్టాలినుగ్రాడు యుద్ధం, ఏమైనా సరే సాగించవలెనంటున్నారు, హిట్లరుకున్నూ, అతని సేనానులకున్నూ యీ వివాదం ఆగస్టు మాసంనుంచీ ప్రారంభమైంది. యుద్ధయాత్ర ప్రారంభించినది హిట్లరు. అతడే యుద్ధకారకుడు. కాని యుద్ధం చేసేదిన్నీ, యుద్ధంలో నాశనమయ్యేదిన్నీ జర్మను ప్రజలు—కనుక, యీ వినాశనమునకు హిట్లరే కారకుడని సేనాధిపతులున్నూ, జర్మను ప్రజలున్నూ గ్రహించారు. కాని, హిట్లరు బలే దొంగ—తనమీదకు నింద రాకుండా చేసుకోవలెనని ఎంచి, తప్పు తనది కాదంటున్నాడు. యుద్ధం సరిగా చెయ్యలేని సేనాధిపతిదే తప్పు అని వాదిస్తున్నాడు.

"బాకు పట్టలేని బాకు, వ్యర్థుడు వద్దిక మాకు" అని బర్తరఫు చేసాడు. కాని హిట్లరిట్లా తన ప్రజలనూ, లోకమునూ ఎంతకాలం మోసం చేయగలడు ?

# ఇండియాలోని బంగారం వంటి పంటలు...



జర్మనీ స్వాధీనం చేసికొనిన యూరపు దేశాల్లో, జపాను స్వాధీనం చేసికొనిన చైనా ప్రాంతాల్లో పంటలను శత్రువులు కొల్లగొట్టుకొని పోతున్నారు. న్యాయంగా అనుభవించవలసిన రైతులు మలమలమాడి చచ్చిపోతున్నారు. మనకు ముఖ్యాధారము వ్యవసాయం కనుక ఇండియాలో ఇది జరగనివ్వగలమా ? అనేక ఉత్పత్తి సాధనాలున్న ఇండియాపై శత్రువుల కన్ను పడింది. మనలను లోబరచుకొనేందులకు జపాను తియ్యటి మాటలను చెప్పును. ఆ మాటల విషయంలో జాగ్రత్త సుమా ! జపాను వారు వచ్చిన మన స్త్రీలు, పిల్లలు మాడుటయే కనుక వారిని ఎదుర్కొనేందులకు సంయుక్తంగా మీ శక్తులను ఉపయోగించండి.

జపానువారి నెదుర్కొనుటకై జాతీయ యుద్ధ రంగమును తయారుచేయుడు.



## నీటిలో యీదే టాంకు.



టాంకులంటే యెటువంటి నేలపైనా పోగల గొంగళి పురుగు కాళ్లవంటి చక్రాలుగల బరువైన ఫిరంగి మోటారులు. ఇదివరకు యివి నేలను మాత్రమే ప్రయాణం చేయగల్గెవి. ఇప్పుడు నీటిపైగూడ పోగల టాంకులు అమెరికాలో తయారౌచున్నవి. సైన్యాలను నీరు దాటించి, సముద్రం ఒడ్డునుండి సరాసరి యుద్ధరంగానికి అంటులాగే పోయి యుద్ధం చేయుటకు రక్షణయొసంగునటువంటి సకవచ వాహనమగు యీ టాంకు అమెరికాలో ఒక సరస్సుపై ప్రయాణంచేయుట యిందు కానవగును.

## ఒక ప్రాచీన సాంప్రదాయం.

క్రైస్తవ మతస్థులు క్రిష్టమసు పండుగ డిశంబరు 24 వ తేదినుండి నూతన వత్సరాది వరకుగల మధ్య ఉత్సవ దినాలలో ఒకరినొకరు అభినందించుకొనుచు, చిత్రవిచిత్రమైన రంగుల బొమ్మలుగలిగి, సద్వచనము లచ్చువేయించియున్న లేఖలు వ్రాసుకొంటారు. ఈ ఆచారము కడుసనాతనమైనది కనుక యుద్ధ సమయంలో యీ ఏడుకూడ జరుగక మానదు.

నేటి కష్టకాలమునందు యిటువంటి లేఖా పత్రములను (క్రిష్టమసు కార్డులు) విశేషం ఖర్చుచేసి అచ్చువేయించుట భావ్యంకాదు. అందువలనవచ్చే లాభాలు అవ్యర్థమైన ధర్మకార్యమునకు ముఖ్యంగా గాయపడినవారికి జబ్బుగానున్నవారికి వినియోగించే మాటుంటే యీ లాంఛనం జరిపించుట న్యాయంగానుండును.

అట్టి లాభాలు ఇండియను రెడ్ క్రాసు సంస్థకు యిచ్చుటకన్న మంచి కార్యము వేరొకటి ఉండబోదు. కావున "రెడ్ క్రాసు క్రిష్టమసు కార్డు" అనునవి అచ్చగుచున్నవి. వాటిలోవచ్చే లాభమంతా ప్రశంసార్హమగు ధర్మకార్యమునకే వినియోగింపబడును. ఈ కార్డులు దేశమంతట జనరలు పోస్టాఫీసులలో డిశంబరు మొదలునుండి విక్రయించబడును. అంతవరకు డబ్బు కొంచెం మిగిల్చియుంచండి. మీమిత్రుల నభినందించి తద్వారా మన కార్యమునకు తోడ్పడుదురుగాని.



PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS.